# నడక

-ఆరి సీతారామయ్య

టీచర్ కవితా స్వరూపాల గురించి పాఠం చెప్తున్నాడు. టకావొ మనసు పాఠం మీద లేదు. కిటికీలోంచి బయటకు చూస్తూ కూర్చున్నాడు. వర్షం పడుతుంది. గాలికూడా ఉధృతంగా ఉంది. ఈ వర్షాకాలానికి ఇదే మొదటి  వాన.

హైస్కూలుకు అటువైపున్న 'షింజూకు జాతీయ వనం' వర్షంలో మసకగా కనబడుతోంది. వనం వెనుక ఉన్న పెద్దపెద్ద భవనాలు పెద్ద చెట్లలాగా కనబడుతున్నాయి.

టీచర్ బోర్డు మీద ఒక కవిత రాస్తున్నాడు. ఇదే మంచి సమయం అనుకుని శబ్దం చెయ్యకుండా క్లాసునుంచి బయటకు వచ్చేశాడు టకావొ. పుస్తకాల సంచి భుజాన వేసుకుని వానలో తడుచుకుంటూ రోడ్డు దాటి షింజూకు వనంలోకి పరిగెత్తాడు. అక్కడ ఒక చిన్న కొలనూ, దాని ఒడ్డు మీద అక్కడక్కడా చిన్నచిన్న పందిళ్ళూ ఉన్నాయి. దగ్గరగా ఉన్న పందిట్లోకి పరిగెత్తాడు టకావొ. అతణ్ణి చూసి పందిట్లో ఉన్న బెంచ్ మధ్యలో కూర్చుని ఉన్న యువతి పక్కకు జరిగి అతనికి చోటు చేసింది. టకావొ వాలకం చూసి తన చేతి సంచిలోంచి ఒక టవల్ తీసిచ్చి, "తల తుడుచుకో, లేకపోతే జలుబు చేస్తుంది," అంది. అతను థాంక్స్ చెప్పి, తల తుడుచుకుని, చొక్కా, పాంట్ కూడా టవల్ తో తుడుచుకున్నాడు.

ఇద్దరూ బెంచ్ మీద కూర్చుని కొలను వైపు చూస్తూ ఉండిపోయారు. కొలనులో ఐరిస్లు వానలో తడుస్తూ, గాలికి ఊగుతూ, తడిచికేరింతలు కొడుతున్న పిల్లల్లాగా చూడముచ్చటగా ఉన్నాయి. ఎంతసేపు చూసినా తనివితీరని దృశ్యం. ఇద్దరూ మంత్రముగ్ధుల్లాగా చూస్తూ ఉండి పోయారు.

వాన కొంచెం తగ్గుముఖం పట్టినప్పుడు ఆమె అతనివైపు తిరిగి, "స్కూలు ఎగ్గొట్టొచ్చావా?" అని అడిగింది. తన చొక్కామీద హైస్కూలు పేరు రాసి ఉండటం వల్ల, కొంచెం సిగ్గుపడుతూ, టీచర్ ప్రాచీన సాహిత్యం గురించి చెప్తుంటే తనకు బోర్ కొట్టిందనీ, పైగా ఇది ఈ సీజన్‌కు మొదటివాన కదా, వానలో తడవాలనిపించిందనీ, తనకు వానంటే చాలా ఇష్టం అనీ చెప్పాడు టకావొ.

లంచ్ టైం అవుతుంది కదా, ఆకలి కావడం లేదా అని అడిగి, తన బాగ్ లోంచి రెండు చాక్‌లెట్లు తీసి అతనకిస్తూ, ఆమె కూడా రెండు చాక్‌లెట్లు తీసుకుంది. ఒక బీర్ బాటిల్ కూడా బయటకు తీసింది. "మీకు లంచ్ అంటే చాక్‌లెట్లూ బీరూనా?" అన్నాడు టకావో, నవ్వుతూ. తన బాగ్ లోంచి లంచ్ బాక్స్ బయటకు తీసి అందులో ఉన్న అన్నం ముద్దలు ఆమెకు ఇవ్వబోయాడు. ఆమె చెయ్యి అడ్డం పెట్టి, "ఫరవాలేదు, నువ్వు తిను," అంది.

తర్వాత ఇద్దరూ చాలాసేపు అక్కడే కూర్చున్నారు కొలనువైపూ, కొలనుచుట్టూ ఉన్న చెట్లవైపూ, దూరంగా కొలనువెనుక ఉన్న భవనాల వైపూ చూస్తూ. కొంచెం సేపటికి వాన ఆగిపోయింది. ఆమె లేచింది. బాగ్ చేతబట్టుకుని వెళ్ళిపోతూ,

*ఉరుము ఉరిమింది*

*మబ్బు పట్టింది*

*వానొస్తుందేమో*

*వస్తే, నాతో ఇక్కడే ఉండిపోతావా?*

అని, సమాధానం ఏంటీ అన్నట్లు చూస్తూ, వెళ్ళిపోయింది.

*

తర్వాత వాన పడిన ప్రతిరోజూ ఆ పందిరికింద ఇద్దరూ కలిశారు. అతను క్లాసులు ఎగ్గొడుతున్నందుకు విచారిస్తూ, "ఏ సబ్జెక్టులంటే ఇష్టం," అని అడిగిందామె. స్కూల్లో ఏదీ ఇష్టం లేదనీ, తనకు అందమైన షూస్ తయారు చెయ్యాలనే కోరిక ఉందనీ, ఇప్పటికే తను ఆ ప్రయత్నంలో ఉన్నాననీ చెప్పాడతను. తల్లిదండ్రులకు అతను షూస్ మీద చూపిస్తున్న మోజు అర్థం కాకుండా ఉందనీ, వాళ్ళు అతనితో సరిగ్గా మాట్లాడటం లేదనీ చెప్పాడు.

బాగా వాన పడుతున్న ఒకరోజు, ఆమె పాదాల కొలతలు తీసుకున్నాడు టకావో. మంచి షూస్ చేసిపెడతానన్నాడు. రకరకాల షూస్ తయారుచెయ్యడానికి ఉపయోగపడే మంచి టెక్నికల్ మాన్యువల్ ఒకటి కొని, అతనికి బహూకరించింది ఆమె.

జులై చివర్లో స్కూలు సెలవులు మొదలయ్యాయి. వానాకాలం కూడా అయిపోయింది. టకావొ ఒక చిన్న షూ కంపెనీలో పార్ట్ టైం ఉద్యోగం సంపాదించాడు. డబ్బులున్నప్పుడల్లా మెత్తటి చర్మాలూ, కుట్టే పనిముట్లూ కొన్నాడు.

*

సెలవుల తర్వాత మళ్ళా సెప్టెంబర్ మొదటి వారంలో హైస్కూలు తెరిచారు. మొదటి రోజు క్లాసుకు వెళ్తున్న టకావొ ఒక పదిమంది అమ్మాయిలు బిల్డింగ్ ఆవరణలో గుమిగూడి ఉండటం చూశాడు. వారి మధ్య ఆమె నిలబడి ఉంది. అందరి ముఖాలు కాంతి విహీనంగా ఉన్నాయి. పరిగెత్తుకుంటూ అక్కడికెళ్ళాడు టకావొ. "మీరు బాగా చదువుకోండి, ధైర్యంగా ఉండండి, వీలైనప్పుడల్లా మన ప్రాచీన కవిత్వం చదువుతారు కదూ," అంటుంది ఆమె, అందరి దగ్గరా సెలవు తీసుకుంటున్నట్లు. ఆమె అక్కడనుంచి వెళ్ళిపోయింతర్వాత తమతమ క్లాసులకు వెళ్ళిపోతున్న విద్యార్థులను, "ఎవరామె?" అని అడిగాడు.

"యుకారి టీచర్ తెలియదా?" అన్నది ఒకమ్మాయి.

"ఇతనెప్పుడూ వేరే ప్రపంచంలో ఉంటుంటాడులే," అంది మరో అమ్మాయి. నిలబడి మాట్లాడిన వారినుంచి టకావొ తెలుసుకున్న విషయాలు ఇవి: ఆమె పేరు యుకారి, స్కూల్లో జపాన్ సాహిత్యంలో జూనియర్ టీచర్. ఆమె దగ్గర చదువుకుంటున్న ఒక అమ్మాయి బాయ్ ఫ్రండ్ ఆమెను ప్రేమించానంటూ వెంటబడ్డాడు. టీచర్ అతణ్ణి తిరస్కరించింది. దాంతో అతను టీచర్ మంచిది కాదనీ, తనను వల్లో వేసుకోవడానికి ప్రయత్నించిందనీ తన గర్ల్ ఫ్రండ్‌తో చెప్పాడు. ఆ అమ్మాయి క్లాసులో అందరికీ మన టీచర్ ఇలాంటిపనులు చేస్తుందట అని ప్రచారం చేసింది. విషయాలన్నీ తెలుసుకున్న యుకారికి ఏం చెయ్యాలో తోచలేదు. జరిగింది జరిగినట్లు హెడ్ మాస్టర్ కి చెప్తే తన విద్యార్థి మీద చర్యలు తీసుకునే అవకాశం ఉంది. పాపం, ఆ అమ్మాయికి నిజం తెలియక తన మీద దుష్ప్రచారం చేసింది. నిజం తెలిస్తే అలా చెయ్యదు. ఏం చెయ్యాలో పాలుపోక, యుకారి స్కూలుకురావడం మానేసింది. కొన్నాళ్ళు దూరంగా ఉండి, చివరకు ఈరోజు స్కూలుకు రాజీనామా చేసి వెళ్ళిపోతోంది. ఇవీ అతను తెలుసుకున్న వివరాలు.

టకావొకి ఆశ్చర్యం కలిగింది, కోపం వచ్చింది. తన విషయాలు అన్నీ తెలుసుకున్న ఆమె తన గురించి ఒక్క మాటకుడా చెప్పలేదు. తనకన్నా పెద్దదిలాగా ఉండటంవల్ల, పేరూ, వివరాలు అడగడానికి తను

సంకోచించాడు. గౌరవంగా మాట్లాడుతూ, మీరు అన్నాడే గాని ఎప్పుడూ పేరు అడగలేదు. టీచర్‌కు ఇవ్వాల్సినంత గౌరవం ఇవ్వకుండా పొరపాటున ఎప్పుడన్నా మాట్లాడాడేమో కూడా!

*

రెండు రోజుల తర్వాత టకావొ స్కూల్లో ఉండగా గాలివాన మొదలయింది. అతడు స్కూల్లోంచి వనంలోకి తడుచుకుంటూ పరిగెత్తాడు.  అక్కడ పందిట్లో ఆమె లేదు. నిరాశ పడుతూ కొలనువైపు చూస్తూ బెంచ్ మీద కూర్చున్నాడు. చాక్లెట్లు తింటూ బీర్ తాగుతూ ఉండేదామె. మనసులో ఉన్న బాధను మర్చిపోవడానికేమో! పాపం. తన స్టూడెంట్‌కి హాని జరక్కూడదని తనమీద పడిన నిందను భరించిందిగాని, పరిష్కార మార్గం ఏంటో తెలియక స్కూలుకు దూరంగా ఉండిపోయింది. ఆమె ఎలాంటి టీచరో తనకు తెలియదు. ఆమె క్లాసు తీసుకుంటే తెలిసేది. మొన్న ఆమె చుట్టూ నిలబడి ఏడుపు ముఖాలేసుకుని ఉన్న స్టూడెంట్సుని బట్టి చూస్తే వారికి ఆమె అంటే ఇష్టం అనిపిస్తుంది. మొదటి సారి వనంలో కలిసినప్పుడు ఒక టాంకా వినిపించి వెళ్ళిపోయింది. అప్పటికి తనకు అది టాంకా అని తెలియదు. తర్వాత తెలుసుకున్నా ఆమెకు దానితో సంబంధం ఏంటో ఆలోచించలేదు. అలా కవిత్వం  వల్లించే వారికి భాష మీద ఎంత ప్రేమ ఉంటుందో!

ఇంతలో గొడుగు వేసుకుని యుకారి టీచర్ వచ్చింది. వర్షం భారీగా పడుతుండటంవల్ల గొడుగు ఉన్నా ఆమె బాగా తడిచిపోయింది. ఇదివరకు ఆమెదగ్గర ఎప్పుడూ ఉండే పిక్నిక్ బాగ్ ఈరోజు లేదు. "నువ్విక్కడ ఉంటావేమోనని బస్సు ఇక్కడ దిగాను. నా ఎపార్ట్మెంట్ ఇక్కడికి దగ్గిరే. వెళ్ళి తల తుడుచుకుని టీ తాగుదాం, వస్తావా?" అని అడిగింది.

*

ఎపార్ట్మెంట్ కి చేరింతర్వాత తల తుడుచుకుని పొడిబట్టలు వేసుకున్నారిద్దరూ. యుకారి టీ చేసింది. టీ తాగుతూ, తను ఆమెకోసం చేసిన స్లిప్పాన్ షూస్ బాగ్ లోంచి తీసి టేబుల్ మీద పెట్టాడు టకావొ. "ఇవి మీకోసం చేశాను, వేసుకుని, సరిగ్గా ఉన్నయ్యో లేదో చూస్తారా? అని అడిగాడు. చూడ్డానికి చాలా అందంగా ఉన్న షూస్ కాళ్ళకు బాగా మెత్తగా అనిపించాయి. "బాగున్నాయి, థాంక్స్," అందామె.

"యుకారి, నేను మిమ్మల్ని ప్రేమిస్తున్నాను," అని తొందరగా అనేశాడు  టకావొ.  అంతలోనే అతడి ముఖం ఎర్రబడింది. గుండె వేగంగా కొట్టుకోవడం మొదలయింది.

“అదేంటీ, యుకారి అన్నావు, యుకారి టీచర్ అనాలిగదా?” అందామె, నవ్వుతూ. అతనికి అప్పటికే చెమటలు పట్టడం మొదలయింది.

“టకావొ, నువ్వెంతో మంచి వాడివి. నాక్కూడా నువ్వంటే చాలా ఇష్టం. పైగా, నీకు తెలియదుగాని, నువ్వు నాకెంతో సహాయం చేశావు. కాని, మనమధ్య ఉంది ప్రేమ కాదు,” అందామె.

మరేంటీ? అన్నట్లు చూశాడతను.

“నీకు తెలియక పోవచ్చు, మన ప్రాచీన భాషలో ఇప్పుడు మనం ప్రేమ అని చెప్పుకుంటున్నామే, దాన్ని ‘ఒంటరి బాధ’ అని అనే వారు. మనుషులకు  తమ మనసులో ఉన్న భావాలను చెప్పుకోవడానికి ఎవరో ఒకరు కావాలి. అలా చెప్పుకోలేకపోతే పడే యాతనని ప్రేమ అనే వారు. మనిద్దరం అనుభవించింది ఆ ప్రేమే. నీకు స్కూలుమీద మనసులేదు. నీ వయసులో షూస్ మీద అంత ఆసక్తి ఉండటం అసాధారణం. అందువల్లే నీ తల్లిదండ్రులు నిన్ను అర్థం చేసుకోలేదు. అందరి నడకా అందంగా ఉండాలని నువ్వు ఆశించడం, తగిన, సౌకర్యంగా, అందంగా ఉండే షూస్ తయారుచెయ్యాలనుకోవడం, ఎంత మంచి ఆలొచనో! నీలో ఉన్న కళాభిమానాన్ని నేను గౌరవిస్తున్నాను.

“ఇక నాకు నువ్వెంత సహాయంచేశావో చెప్పడం కష్టం. ఈ పాటికి నీకు తెలిసే ఉంటుంది. నా సమస్యను ఎలా పరిష్కరించాలో తెలియక నేను చాలా మానసిక క్షోభకు గురయ్యాను. నా ఒంటరితనంలో అనుకోకుండా నువ్వు తోటలోకి రావడం, నీతో మాట్లాడే అవకాశం దొరకడం, నాకెంతో ఊరట కలిగించింది. ఇక్కడ ఉద్యోగం మానుకుని తిరిగి మావూరు వెళ్దామనే నిర్ణయం తీసుకోవడం నీతో కలవకపొతే సాధ్యం అయ్యేది కాదేమో. నువ్వెలా నీ ఆశల దిశగా నడిచే ప్రయత్నం చేస్తున్నావో, నేను కూడా నా బాట ఏంటో తెలుసుకుని, ఆ దోవన మళ్ళా నడవడం నేర్చుకోవాలని నిర్ణయించుకున్నాను. నువ్విచ్చిన షూస్ నా ప్రయత్నంలో సహకరిస్తాయి. నేను నీకు ఎప్పుడూ రుణపడి ఉంటాను,” అందామె.

“కాని, మీరు నన్నెందుకు మోసం చేశారు? మీరు టీచర్ అని నాకెందుకు చెప్పలేదు?” అని అడిగాడతను.

“నువ్వు ఆ స్కూల్లోనే చదువుతున్నావు. నా క్లాస్ తీసుకోలేదు కాబట్టి అదృష్టవశాత్తూ నీకు నేను తెలియదు. కానీ, ఆ స్కూలుతో నా సంబంధం ఏంటో నేను నిర్ణయించుకోలేక సతమతమవుతున్న రోజుల్లో నేను అక్కడ టీచర్ని అని నీకు చెప్పాలనిపించలేదు. అంతే గాని, నిన్ను మోసం చెయ్యాలని కాదు.”

ఇంతలో పెద్ద ఉరుము వినబడింది. మళ్ళా వాన ఉధృతం అవుతుందేమో.

టకావొ యుకారిని చుస్తూ,

*ఉరుము ఉరిమింది*

*వాన వచ్చినా రాకపోయినా*

*ఇక్కడే ఉంటాను*

*నీకు తోడుగా*

అన్నాడు. చూడండి, నాక్కూడా కొంచెం కవిత్వం అర్థం అవుతుంది అన్నట్లు చూస్తూ.

“చాలా బాగుంది. అంటే, నువ్వు మన్యూషా గారి కవిత్వం చదివావన్న మాట! నాకు చాలా సంతోషంగా ఉంది. మనం స్నేహితులుగా ఉందాం. నేను మా వూరు వెళ్ళాక అప్పుడప్పుడూ ఉత్తరం రాస్తాను. నువ్వుకూడా రాస్తూ ఉండు. ఎప్పుడో మళ్ళా కలుసుకుందాం. అప్పటి దాకా మనిద్దరం మన ఆశయాల దిశగా నడవడానికి ప్రయత్నం చేద్దాం,” అందామె.

అంగీకారం తెలుపుతూ గౌరవసూచకంగా తలవంచాడతను.

*- ప్రముఖ జపాన్ రచయిత మకోతో షింకాయి గారి ‘కొతొనొ వ నివా’ (మాటల వనం) ఆధారంగా*